## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 99999990128970

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నవ శిక్షిత సాహిత్యమాల

# పూల మొక్కల పెంపకం

రచన

డా. సమ్మెట గోవర్ధన్

చిత్రాలు

డి. కె. దాస్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ఈ పుస్తకం రాష్ట్ర వయోజన విద్యావసరుల కేంద్రం, హైదరాబాద్, ఆంధ్ర ప్రదేశ్ మరియు నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా సంయుక్తంగా నిర్వహించిన వర్క్‌షాప్‌లో తయారుచేయబడినది.

ISBN 81-237-2653-8

ప్రథమ ముద్రణ 1999 *(శక 1920)*



Poola Mokkala Pempakam (*Telugu Original*)

**రూ. 8.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్, న్యూఢిల్లీ-110016 ద్వారా ప్రచురింపబడినది.

# పూల పెంపకం - విశేషాలు

1. ఉత్సవాలు, పండుగలు, పెళ్ళిళ్ళకు పూలను బాగా వాడతాం.
2. పూల దండలు, పుష్పగుచ్ఛాల తయారీకి పూలు ఉపయోగిస్తారు.
3. గులాబి, మల్లె, సంపెంగల నుండి అత్తరు తయారు చేస్తారు.
4. మనదేశంలో వార్షికంగా 205 కోట్ల రూపాయల విలువచేసే 21 వేల టన్నుల పుష్పాలను వాడుతున్నారు.
5. 1994-95 సంవత్సరంలో మనదేశం నుండి 30కోట్ల రూపాయల విలువ గల పూలను ఎగుమతి చేశారని అంచనా.
6. మనదేశంలో పలురకాల వాతావరణంగల వివిధ ప్రాంతాలున్నాయి. చాలా రకాల పూలు సాగుచేయపచ్చు.
7. జాతీయ వ్యవసాయ కమీషన్ ఈ శతాబ్దాంతానికి మనదేశంలో 50 వేల హెక్టార్లలో పూల తోటలు పెంచాలని సూచన చేసింది.

ఆ ఊరి పేరు దామెర. నగరానికి దగ్గరలోనే వుంది. వ్యవసాయం అక్కడి ప్రజల ప్రధాన వృత్తి. కష్టజీవులు. కాలువలు లేనప్పటికీ, పెద్ద చెరువులు, బావుల ద్వారా నీటి వసతి ఉంది.

రాములు ఒక చిన్న రైతు. యువకుడు, తెలివిగలవాడు. వచ్చిన రాబడితో కాలం గడుపుతున్నాడు. రాములుది చిన్న కుటుంబం. ఒక పాప, ఒక బాబు. తాను అంతగా చదవకున్నా, తన పిల్లలను బాగా చదివించాలని ఆశ. పెద్ద చదువులంటే మాటలా? డబ్బుకావాలి. ఇప్పటి నుండీ కొంత దాచిపెట్టనిదే లాభంలేదు. కాని సంపాదన పెరిగే దారేది? అని బాధపడసాగాడు రాములు.

తీరిక సమయంలో రాములు ఈ విషయమే ఆలోచించేవాడు. పంతులును సలహా అడగాలి. ఏదైనా ఉపాయం చెప్పకపోడు అనుకుంటూ, పంతులు ఇంటికి చేరాడు రాములు.

పంతులు కొడుకు రాజు కనిపించాడు. రాజు ఊరి పాఠశాలలో తనతో చదివినవాడే. తాను పై చదువులకు పట్నం పోలేక పోయాడు. రాజు పట్నంలో వ్యవసాయానికి సంబంధించిన కోర్సు చదువుతున్నాడు. రాములును చూసిన రాజు ఏం ... రాములూ ... బాగున్నావా? అంటూ పలకరించాడు.

రాములు . బాగానే ఉన్నా ... నీ చదువు అయిపోయిందా?

రాజు : అయిపోయింది రాములూ ... ఇక మన ఊరిలోనే వుండి వ్యవసాయంచేస్తా.

రాములు : అదేమిటి? ఇంత చదివి సర్కారు నౌకరీ చెయ్యవా ఏమిటి?

రాజు : రాములూ ... సర్కారు నౌకరీలు అందరికీ ఎలా దొరుకుతాయి? మాకు ఉన్న భూమిలోనే సాగు చేస్తా. అదిసరే గాని, నీ సంసారం ఎలా ఉంది? పిల్లలు బాగా చదువుతున్నారా?

రాములు : ఇప్పటికైతే ఫరవాలేదు. బాగానే చదువుతున్నారు. ముందే ఎలా వుంటుందో ఏమో?

రాజు : అదేమిటి, అలా అంటావు. సంగతి ఏమిటో సరిగా చెప్పు.

రాములు : అదే పిల్లలను బాగా చదివించాలనుకుంటున్నా... ఎంత డబ్బు కావాలో ఏమిటో?

రాజు : నిజమే ! పెద్ద చదువులు చదవడానికి డబ్బుకావాలి. అయితే మంచి మార్కులు తెచ్చుకుంటే స్కాలర్‌షిప్ ఇస్తారు. అయినా నీవు కొంతైనా ఖర్చు చేయాల్సి ఉంటుంది.

రాములు : అదే ... ఏం చేయాలో తెలియకుండా ఉంది. ప్రస్తుదాంతో చదివించడం కష్టం. ఆదాయం పెరిగే దారేదైనా వుంటే చెప్పరాదూ?

రాజు : అదేం రాములూ ... కష్టపడి ఏదైనా ఒక పనిచేస్తే ఆదాయం పెరగకపోదు.

రాములు : ఈ ఊరిలో నేనేమి చేయగలను పంతులూ?

రాజు : అలా నిరాశపడకు. పనికోసం పట్నం పోవాల్సిన అవసరం లేదు. ఈ ఊరిలోనే. నీకు ఉన్ననేలలోనే పనిచేసుకోవచ్చు. మరింత ఆదాయం పొందవచ్చు.

రాములు : అదెలాగంటారు?

రాజు : మన ఊరు నగరానికి దగ్గరే ఉంది కదా. మీబావి దగ్గర కొంత భూమిలో పూలమొక్కలు పెంచావనుకో ... నీకు మంచి ఆదాయం లభిస్తుంది.

రాములు : పూల మొక్కల పెంపకం గూర్చి నా కంతగా తెలవదు కదా!

రాజు : నీకెందుకు ... నేనులేనూ...ఇకనేను ఇక్కడే వుంటాను కదా! అన్ని విషయాలు వివరంగా చెబుతాను. నీకే అనుమానం వచ్చినా నన్నడుగు. సరేనా...

రాములు : మంచిది రేపు మళ్ళీవస్తా...

రాజు : సరే అలాగే ...

## II

మరునాడు సాయంత్రం రాములు రాజు ఇంటికి చేరాడు. రాజు చెప్పసాగాడు. పూలు ఎంతో విలువైనవి. పూలదండలు, పూలగుత్తులు, పండుగలు, పెళ్ళిళ్ళు, అలంకరణలో పూలు వాడతారు. పూల నుండి అత్తర్లు తయారుచేస్తారు. పట్టణాలు, నగరాల్లో పూలకు బాగా గిరాకీ ఉంటుంది. పూలను సాగు చేసి మంచి ఆదాయం పొందవచ్చు. వివిధ కాలాలలో పూసే పూలను సాగుచేయడం వలన, సంవత్సరం పొడవునా ఆదాయం వస్తుంది. పైగా నీరు ఎక్కువగా అవసరం ఉండదు.

రాములు : అలాగా... అయితే ఏయే పూలు పెంచితే మంచిదో చెప్పవూ.

రాజు : బంతి, చేమంతి, గులాబి, కనకాంబరాలు, మల్లెలు... ఇలా ఎన్నో పూలను పెంచవచ్చు.

రాములు : అయితే పూలచెట్లు పెంచడానికి మొదట ఏంచేయాలి?

రాజు : మొదట నేలను అనువుగా తయారు చేసుకోవాలి.

రాములు : అదెలాగ?

రాజు : మొక్కలు నాటడానికి 8-10 రోజుల ముందుగా భూమిని తయారు చేసుకోవాలి. నేలను రెండుసార్లు తవ్వాలి. మూడవ సారి తవ్వినపుడు ఎరువు వేయాలి. 20x5 అడుగుల భూమికి మూడు బుట్టల కంపోస్ట్ ఎరువు వేసి బాగా కలపాలి. నేలను సమంచేయాలి. కొన్ని రోజులు అలాగే వుంచాలి. కాబట్టి ఎండ బాగా తగిలి హానిచేసే పురుగులు చనిపోతాయి. చాలాసార్లు తవ్వడం వల్ల నేల గుల్ల బారుతుంది. మొక్కలవేర్లు బాగా వ్యాపిస్తాయి.

రాములు : సరే ... ఆ తరువాత ఏమి చేయాలి?

రాజు : ఒక్కో పూలమొక్క సాగుకు సంబంధించిన విషయాలు వేరువేరుగా వుంటాయి. వాటిని జాగ్రత్తగా పాటించాలి.

రాములు : చెప్పండి శ్రద్ధగా వింటాను.

రాజు : మొదట చేమంతిని తీసుకొందాం. చేమంతి సెప్టెంబర్ నుంచి ఫిబ్రవరి వరకు పూస్తుంది. సీజన్ అయిన తరువాత పెద్ద మొక్కను తవ్వితీయాలి. గడ్డను విడదీసి వేరుతో సహా విడిగా నాటుకోవాలి. పెద్దమొక్క చుట్టూ వచ్చిన పిలకమొక్కలను కూడా తీసి నాటుకొంటే, మరు సంవత్సరానికి బాగా పూస్తాయి. ప్రతి సంవత్సరం ఇలా స్థలం మారిస్తే, పువ్వులు పెద్దగా ఎక్కువగా పూస్తాయి.

రాములు : చేమంతి నాటడానికి ముందు భూమిని ఎలా తయారు చేసుకోవాలి?

రాజు : నేలను మెత్తగా దున్నాలి. ఆ తరువాత బాగా మాగిన పశువుల ఎరువు, కుళ్ళిన ఆకులు, ఆముదం పిండివేసి మట్టిలో కలపాలి. కొద్ది పాళ్ళలో భాస్వరం, పొటాష్, సూపర్ ఫాస్ఫేట్‌ను వేయాలి.

రాములు : చేమంతిలో మంచి రకాలు ఏవి?

రాజు : కో-1, ఎం.డి. యు-1, మెగామి, కస్తూరి రకాలు అధిక దిగుబడి నిస్తాయి.

రాములు : చేమంతి సాగులో తీసుకోవలసిన జాగ్రత్తల గూర్చి చెప్పండి.

రాజు : మొక్క మొక్కకూ మధ్య సుమారు అడుగు దూరం ఉండాలి. నాటిన మూడు రోజులకు మడిని నీటితో మరోసారి తడపాలి. ఆ తరువాత వారానికోసారి నీరు ఇస్తేచాలు. చలికాలం దాకా పూలుపూస్తాయి. 4-6 రోజుల కొకసారి పూలను కోయాలి.

రాములు : ఆహా!...అలాగా...

రాజు : ఇలా మొదటి పంట చేతికందిన తరువాత మొక్కలను నేల మట్టానికి లేదా 5 సెంటి మీటర్ల ఎత్తులో కత్తిరించి వెయ్యాలి.

మొక్క మొదళ్ళలోని మట్టిని ఎగతొయ్యాలి. సూఫర్ ఫాస్ఫేట్, పశువుల ఎరువును కలిపి నీరు పెట్టాలి. కొన్ని రోజులకు మరోపంట చేతికి వస్తుంది.

రాములు : చేమంతికి వ్యాధులేవీ రావా?

రాజు : పేను బంక, ఎర్రనల్లి, ఆకులను, పూలను తినే గొంగళి పురుగులకు ఒక లీటరు నీటిలో రెండు మిల్లీలీటర్ల మోనోక్రోట్ ఫాస్ లేదా మలాథియాస్ చల్లాలి. ఆకు మచ్చకు బావిస్టిన్ ఒక లీటరు నీటికి ఒక గ్రాము, వేరుకుళ్ళు, ఎండు తెగుళ్ళకు కాప్టాన్ ఒక లీటరు నీటికి 2 గ్రాములు కలిపి నేల తడిచేలా పిచికారి.చేయాలి.

# III

రాజు : ఈ రోజు కనకాంబరాల గూర్చి చెబుతాను. కనకాంబరాలు పసుపు, ఇటుక, కనకాంబరం రంగులలో వుంటాయి. వీటిని నారువేసి పెంచాలి. కనకాంబరాలు 2-3 రోజుల వరకు వాడిపోవు. చేమంతి లాగే పెద్దమొక్క చుట్టూ చిన్న మొక్కలు వస్తాయి. వీటిని కాస్త ఎదగనిచ్చి తీసి విడిగ నాటకోవాలి.

రాములు : వీటిలో ముఖ్యమైన రకాలు ఏవంటారు?

రాజు : రెండు రకాలు ముఖ్యమైనవి. నారింజ, పసుపు రంగుల్లో వుంటాయి. వీటిని విత్తనాలు, కొమ్మంట్ల ద్వారా వ్యాప్తి చెయ్యవచ్చు.

రాములు : కనకాంబరాల సాగులో తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పరూ?

రాజు : కనకాంబరాలు నాటే ప్రదేశాన్ని తవ్వి, మెత్తగా తయారు చేసుకోవాలి. పశువుల ఎరువు కలిపి, నేలను బోదెలుగా చేసుకోవాలి. కనకాంబరాలను బోదెల మీద నాటాలి. మొక్క మొక్కకూ మధ్య అడుగు దూరం ఉండాలి. నాటే ముందు మొక్క వేళ్ళను సెరసాన్‌లో ముంచి నాటితే, మొక్కకు తెగులు సోకదు.

రాములు : మరేం జాగ్రత్తలు తీసుకోవాలి?

రాజు : నాటిన తరువాత వారానికి రెండుసార్లు, ఆ తరువాత వారానికి ఒక సారి నీళ్ళతో తడపాలి.

రాములు : నారు మొక్కలు పెంచవచ్చా?

రాజు : విత్తనాలను చల్లి, నారు తయారు చేసుకొని, నారును బోదెలలో నాటుకోవచ్చు. కొంతమేర నేలను మెత్తగా తయారు చేసుకొని విత్తనాలు చల్లుకోవాలి. నారుమొక్కలపై 5 శాతం డి.డి.టి.ని చల్లితే నారు మొక్కలను కొరికి తినే పురుగులు రావు. తరువాత ఒక లీటరు నీటిలో ఒక గ్రాము సెరసాన్ కలిపి నారు మీద చల్లాలి. మొక్కలు బలంగా ఎదగటానికి కొద్దిగా అమోనియం సల్ఫేటు చల్లాలి.

రాములు : ఎన్నిరోజులకు నాటుకోవాలి?

రాజు : నారు వేసిన 50 రోజులకు నాటుకోవచ్చు. మొక్కలు బాగా ఎదగడానికి పశువుల ఎరువు అవసరం. వేరు శనగపిండిని అమోనియం సల్ఫేటుతో కలిపి వాడవచ్చు. 2 వంతుల పిండికి ఒక వంతు అమోనియం సల్ఫేటు కలిపి వెయ్యాలి. మొక్కలు నాటిన నెలరోజుల తరువాత ఒకసారి, ఆరు నెలల తరువాత మరోసారి పిండివేస్తే చాలు.

రాములు : కనకాంబరాలు ఎన్నిరోజులకు పూస్తాయి?

రాజు : మూడు మాసాల్లోనే పూత మొదలవుతుంది. పూర్తిగా విచ్చుకున్న పూలను కోయాలి. రోజు విడిచి రోజు పూలు కోయాలి. ప్రతి రెండు మూడు కోతల కొకసారి తడిపెట్టాలి. ఎకరాకు 8 వేల రూపాయల ఆదాయం వస్తుంది.

## IV

రాములు : గులాబీ మొక్కలు పెంచితే ఎలా వుంటుంది?

రాజు : చాలా మంచిది. ఎన్నో రకాల గులాబీలున్నాయి. ఎరుపు, తెలుపు, పసుపు, పింక్, ఆరంజి ఇక్కడ సాధారణంగా పెరుగుతాయి. పొదలు, తీగల రకాలూ వున్నాయి.

రాములు : మొక్కను నాటడానికి ముందు ఏం చెయ్యాలంటారు?

రాజు : గులాబి మొక్కను నాటడానికి వారం, పదిరోజుల ముందు

2x2x2 అడుగులలో గొయ్యి తవ్వాలి. మట్టిసంతా పైకి తీసి, 2,3రోజులు ఎండతగిలేలా వదలాలి. ఆ తరువాత పాటి మన్ను, ఇసుక, ఎరువు సమపాళ్ళలోవేసి, నాలుగు అంగుళాలు వదిలి గుంట నింపాలి. మొక్క నాటే ముందు రోజు గుంటను నీటితో తడపాలి. మొక్కను గుంట మధ్యలో నాటితే వేళ్ళు అన్ని వైపులా సమంగా పెరుగుతాయి.

రాములు : గులాబీల సీజన్ ఎప్పుడు?

రాజు : సెప్టెంబరు నుండి ఫిబ్రవరి వరకు గులాబి బాగా పూస్తుంది. ఎరువువేసి మందుకొడుతుంటే మార్చిలో కూడా బాగానే పూస్తుంది.

రాములు : గులాబి మొక్కలను ఎలా వృద్ధి చేయాలి?

రాజు : గులాబి కొమ్మలను కత్తిరించి అంటుకట్టి గ్రాఫ్టింగ్, బడ్డింగ్, గూటింగ్ ద్వారా అభివృద్ధి చేస్తారు.

రాములు : కటింగ్ ఎలా చేయాలో తెలుపరూ?

రాజు : కొమ్మల కటింగ్ వర్షాకాలంలో చేయాలి. రెండు కొమ్మల జాయింటుకు 4 అంగుళాల క్రిందకు కత్తిరించి, ఆకులు తీసి ముందు తయారు చేసుకున్న నేలలో, జాయింట్ నేలలో వుండేలాగ నాటాలి. నేలకు నీడ, నీటి సదుపాయం బాగా వుండాలి. కొమ్మపై బాగం పేడముద్దతో పూయాలి. ఎండ తగలకుండా 6 నుండి 8 వారాలు బాగా చిగురనివ్వాలి. ఆ తరువాత తయారు చేసుకున్న గుంతలో నాటాలి. బాగా నాటుకునే వరకు నీళ్ళు వేయాలి. ఒంటి కొమ్మనాటితే, 2 కణుపులు భూమిలో ఉండేలా నాటాలి

రాములు : గులాబిని ఏ విధంగా అంటుకట్టాలి?

రాజు : వర్షాకాలంలో గులాబి అంట్లు కట్టాలి. నేలకు దగ్గరగల కొమ్మను జాగ్రత్తగా వంచి మధ్యభాగంలో ఆకులు తీసి. మట్టిని కాస్తకెలికి, అక్కడ కొమ్మను వుంచి పైనమట్టి కప్పి, కదలకుండా రాయిపెట్టాలి. రోజూ నీరు చల్లాలి. 10 నుండి 12 వారాలకు వేర్లు వస్తాయి. అప్పుడు కొమ్మను మొదట సగభాగం కత్తిరించి అలావుంచి, మరుసటి వారం పూర్తిగా కత్తిరించి, తరువాత నాలుగు, ఐదు రోజులకు మట్టి తవ్వి,

వేరు చుట్టూ మట్టి కదలకుండా, జాగ్రత్తగా తీసి మరో గుంటలో నాటాలి. వారం రోజులు రెండు పూటలూ నీరు పోసి కాపాడాలి.

రాములు : అది సరే... గ్రాఫ్టింగు ఎలా చేస్తారో వివరించరూ?

రాజు : గ్రాఫ్టింగు చేయడానికి సెప్టెంబర్ నెల అనుకూలమైనది. మంచి గులాబీ మొక్క కొమ్మను ఎన్నుకొని పై కొస కత్తిరించాలి. కొమ్మ కొసలో ఏటవాలుగ చెక్కాలి. పైన వెడల్పుగా,



కొన సన్నగా వుండాలి. 6 లేదా 7 అంగుళాల మంచి జాతి కొమ్మ కొన ఆకులతో తీసుకోవాలి. క్రిందికొస ఏటవాలుగ, మొదటి దానికి వ్యతిరేకంగా చెక్కాలి. మామూలు కొమ్మ చెక్కిన భాగం పైకొస కాస్త ఎత్తి, మంచికొమ్మ కొసను అందులో దోపి పోలితిన్ పేపరుతో 3 లేదా 4 మార్లు గట్టిగా చుట్టి దారం కట్టాలి. కొమ్మల ఆకులు, చిగురు తీసివేయాలి. 4 లేదా 5 వారాలకు గ్రాఫ్టింగ్ చేసిన దగ్గర చిగురు వస్తుంది. దానిని వుంచి పెరగ నివ్వాలి. దీనికి మంచి పూలు పూస్తాయి.

రాములు : సరే ... మరి బడ్డింగ్ ఎలా చేస్తారో చెప్పరూ?

రాజు : సెప్టెంబర్ నెలలో బడ్డింగ్ చేయాలి. ఇందుకై మంచి పూల కొమ్మను ఎన్నుకొని, బడ్డింగ్ వచ్చే భాగం ఆకుతో ఒక సెంటి మీటరు పొడవు చర్మం వచ్చేలా పదునైన కత్తితో కోయాలి. ఈ ముక్క కన్నా కాస్త చిన్నభాగం మామూలు మొక్కలోని కొమ్మకు కత్తిరించి నాలుగువైపులా కాస్త పైకి లేపి, ఈ ముక్కను అందులో దోపాలి. బడ్డింగ్ ఆకులు జాగ్రత్తగా చూసుకోవాలి. తరువాత గట్టిగా నొక్కి పోలిథిన్ పేపరుతో 2 లేదా 3 మార్లు గట్టిగాచుట్టి దారం కట్టాలి. బడ్డింగ్ ఆకులు బయటికి వుండాలి. ఈ కొమ్మలోని ఆకులు, చిగురు తీసివేయాలి.

రాములు : గులాబీలను గూటింగ్ పద్ధతిలో ఎలా పెంచుతారు?

రాజు : గూటింగ్ వర్షాకాలంలో చేయాలి. గూటింగ్ చేసే కొమ్మకు మొక్క వైపు నుండి 6 నుండి 8 అంగుళాల దూరంలో 4 అంగుళాలమేర ఆకులు, ముళ్ళుతీసి, చాకుతో మృదువుగా గోకాలి. రంపపు పొట్టు, మట్టి సమపాళ్ళలో కలిపి ముద్ద చేసి, గోకినభాగం చుట్టూ పెట్టినొక్కాలి. పెద్ద పాలిథిన్ ముక్కతో 2,3 సార్లు చుట్టి, రెండు వైపులా గట్టిగా 5,6 పొరల దారంతో కట్టాలి. 4 నుండి 5 వారాలకు మట్టిలో తెల్లటి వేర్లు కన్పిస్తాయి. ఆ కొమ్మను 2 దఫాలుగా కత్తిరించి వేరేచోట నాటాలి.

రాములు : ఇవన్నీ సరే ! గులాబీ బాగా పెరగాలంటే ఏమేమి జాగ్రత్తలు తీసుకోవాలి?

రాజు : మంచి ప్రశ్నవేశావ్. గులాబీ బాగా పెరగటానికి జూలై, నవంబర్ నెలలలో ఎరువు వేయాలి. మొక్క చుట్టూ గొయ్యి తవ్వి రెండు రోజులు ఆరనిచ్చి ఆ తర్వాత పశువుల ఎరువు, ఎం.పి.కె 15 : 15 :15, పాటి మన్ను, ఈ మూడూ కలిపి వేసి, బాగా నీరు పోయాలి. ఒక్కొక్క మొక్కకు 200 గ్రాములు ఎం.పి.కె వేయాలి.

రాములు : గులాబి బాగా పూయాలంటే ఏం చేయాలి?

రాజు : పూలు పెద్దవిగా, ఎక్కువగా పూసి త్వరగా రాలి పోకుండుటకు ప్లానోఫిక్స్ అనే మందును నీళ్ళలో కలిపి మొక్క పూర్తిగా తడిసేట్లు చల్లాలి. 15నుండి20 రోజులకోమారు ఒక గాలన్ నీటిలో ఒక మిల్లీ లీటరు మందు కలిపి ఎండ వేళల్లో చల్లాలి.

రాములు : గులాబీలకు తెగుళ్ళేవి రావా?

రాజు : ఎందుకు రావూ... గులాబీలను తెగుళ్ళ నుంచి కాపాడటానికి పెరాతిన్, బైటెక్స్‌లను నీళ్ళలో కలిపి, మొక్కలు పూర్తిగా తడిసేలా చల్లాలి. ఒక గాలన్ నీటిలో ఒక మిల్లీ లీటరు పెరాతిన్, 10 గ్రాముల బైటెక్స్‌ను కలిపి ఎండ సమయంలో స్ప్రే చేయాలి.

రాములు : గులాబీలను నష్టపరిచే కీటకాల గూర్చి చెప్పరూ?

రాజు : గులాబీలను నష్టపరిచే కీటకాలలో ఎర్ర పొలుసు పురుగు ముఖ్యమైనది. పురుగు సోకిన మొక్క సరిగా ఎదగదు. కొమ్మలు, ఆకులు ఎండిపోతుంటాయి. వ్యాధి ఎక్కువగా సోకిన మొక్కల కొమ్మలను కత్తిరించి వెయ్యాలి. కొమ్మల మీద 0.1 శాతం మెలథియాన్ పలుచగా పిచికారీచేస్తే వ్యాధి నివారించ బడుతుంది.

రాములు : గులాబిని మరేవైనా కీటకాలు ఆశ్రయిస్తాయా?

రాజు : చెదపురుగులు, బిళ్ళపురుగులు, పేనుబంక, పచ్చదోమ, సన్న గొంగళి పురుగులు సైతం గులాబిని వ్యాధి గ్రస్తం చేస్తాయి. చెదపురుగులకు గుంటలో 5/150 బి. హెచ్.సి, బిళ్ళ పురుగులకు బి.హెచ్.సి. 1/50 పంతు పేను బంకకు 1/5 పంతు పైరోడస్టు, పచ్చదోమకు 3/100 పారథీన్, సన్నగొంగళి పురుగులకు బి.హెచ్.సి. డస్ట్ 5/100 చల్లితే

సరిపోతుంది.

రాములు : గులాబీలు బాగా పూయాలంటే ఇంకా ఏం చేయాలి?

రాజు : పూలు పూసిన కొమ్మను ఆరు అంగుళాల మేర కత్తిరిస్తే ఎక్కువ పూలు పూస్తాయి. వర్షాకాలంలో గులాబీ కొమ్మలు క్రింది వరకు 1 లేదా 2 అడుగులు వరకు కత్తిరిస్తే చక్కగా చిగుర్చి ఎక్కువ పూలు పూస్తాయి. అలాగే ఎండిన పుల్లలు తొలగించాలి. కాచిన టీ పొడి, పుల్లితొక్క కూడా గులాబీలకు మంచిది. వారానికి ఒక సారి మొక్క మొదలు దగ్గర తవ్వి పుల్లి తొక్కలు పాతివేస్తే మంచిది.

## V

రాములు : మల్లెల పెంపకం గూర్చి చెప్పరూ?

రాజు : సరే, ఈ రోజు మల్లెసాగు గూర్చి చెబుతాను. మల్లెను నాటడానికి వారం రోజుల ముందు $2\frac{1}{2}$ x $2\frac{1}{2}$ అడుగుల గొయ్యి తవ్వి ఆరనిచ్చి పాటి మన్ను, ఎరువు కలిపి నింపి ఆరబెట్టాలి. పెద్ద చెట్టు పక్కన వచ్చే మండలు వేర్లతో తీసి నాటవచ్చు. అంటు పెట్టి కూడ నాటవచ్చు. డిసెంబర్‌లో ఆకులు దూసి గొప్పు తవ్వి 4 లేదా 5 రోజులు ఆరనిచ్చి, ఎరువువేసి నీరు పెట్టాలి. కంపోస్ట్ గాని, అమోనియాగాని, యూరియాగాని వేయాలి. మార్చి ఆఖరులో పూలు రావడం తగ్గుతుంది. తిరిగి ఆకు దూసి, తవ్వి, ఆరబెట్టి నీరు ఇవ్వాలి. తెగుళ్ళకు మలాథియాన్ స్ప్రే చేయాలి.

రాములు : మల్లెల్లో మంచి రకాలు ఏవి?

రాజు : మల్లెల్లో చాలారకాలు ఉన్నాయి. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కో పేరు చెబుతారు. బెంగుళూరు మల్లె, పెద్దమొగ్గ, గుండు మొగ్గ, సన్నజాజి, చంభేలి. చంభేలి కొమ్మలు గొట్టాల్లాగా పొడవుగా వుంటాయి. ఎత్తు పందిరివేసిగాని లేదా ఇంటిపై కప్పులకుగాని ఎక్కించాలి. ఈ రకం మల్లెలు సాయంత్రం విచ్చి చాలా సువాసన కలిగివుంటాయి.

రాములు : మల్లె మొక్కలకు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి?



రాజు : మల్లె మొక్కలను తరచుగా కత్తిరించాలి. చలికాలంలో మల్లె ఆకులు రాలడం మొదలవుతుంది. ఆ తరువాత చెట్లకు నీరివ్వడం తగ్గించాలి. మిగిలిన ఆకులను కూడా రాల్చి వెయ్యాలి. జనవరి నెలలో మొక్కల ఎండిన కొమ్మలను సగం ఎత్తు వరకు కత్తిరించాలి. జనవరి నెల ఆఖరి నుండి నీరివ్వాలి. ఏడాదికోసారి కుళ్ళిన ఆకులు, మొక్కల కంపోస్టు లేదా పశువుల ఎరువు వాడవచ్చు. పందిరి మల్లెలకు మాత్రం వర్షాకాలం ఆరంభంలో అనగా జూన్ నెలలో కొమ్మలు కత్తిరించాలి.

రాములు : మల్లెలకు మరేమి ఎరువులు వాడాలి?

రాజు : రసాయనిక ఎరువులు సంవత్సరానికి రెండు సార్లు ఇవ్వాలి. జూన్, జులైలలో ఒకసారి, డిసెంబర్, జనవరిలలో మరోసారి వాడాలి. ఒక పొదమల్లె మొక్కకు 200 గ్రాములు, పందిరి మల్లెకు 50 గ్రాముల అమోనియా సల్ఫేట్ అవసరం. అలాగే పందిరిమల్లెకు 125 గ్రాములు, పొదమల్లెకు 400 గ్రాముల సూపర్ ఫాస్ఫేట్ వేయాలి. నాటిన రెండు సంవత్సరాలకు మల్లెలు పూస్తాయి. వేసవిలో ఎక్కువగాను, వర్షాకాలంలో తక్కువగా పూస్తాయి. ఎకరానికి 6 నుంచి 10 వేల రూపాయల ఆదాయం లభిస్తుందని అంచనా.

## VI

రాములు : ఈ రోజు ఏ పూవు గూర్చి చెబుతావు?

రాజు : ఈ రోజు బంతి సాగు గూర్చి చెబుతాను. బంతిని పెంచడం చాల సులభం. వివిధ నేలలు, శీతోష్ణ పరిస్థితులకు అనువైనవి. బంతిపూలు వ్యాపారస్థాయిలో అమ్ముకోవచ్చు. మనదేశంలో రెండు రకాల బంతి పూలు సాగులో వున్నాయి. అవి పొడవుగా వుండే ఆఫ్రికన్ మరియు పొట్టిగా వుండే ఫ్రెంచిరకాలు.

రాములు : బంతి గూర్చి మరిన్ని వివరాలు తెలపండి ?

రాజు : పొట్టి రకం త్వరగా పూస్తుంది. బంతిచెట్లు బలమైనవి. పలు రకాల నేలల్లో పెరుగుతాయి. ఫ్రెంచి బంతి తేలికనేలలో బాగా పెరుగుతుంది. ఆఫ్రికన్ బంతికి మాత్రం ఎరువు బాగావేసిన సారవంతమైన, తేమగల నేలకావాలి. పొడుగు, పొట్టి రకాలకు నీరు ఇంకిపోయేనేల, ఎండ అవసరం. మంచు దెబ్బను తట్టుకోలేవు. ఈ కారణంగా అతి చలిగా ఉన్నకాలం తప్ప మిగిలిన సంవత్సరం పొడవునా వీటిని పెంచవచ్చు.

రాములు : బంతిని ఏ నెలలో విత్తుకోవాలంటారు?

రాజు : మే - జూన్‌లో నారు మడులలోగాని, ఆగష్టు నుండి అక్టోబరు వరకు, ఫిబ్రవరి - మార్చిలోనూ విత్తుకోవచ్చు. మొలకలు 2.5 నుండి 5.1 సెంటి మీటర్ల పొడవున్నప్పుడు ఎత్తి

దూరంగా నాటుకోవాలి. విత్తనాలు వేసిన నెలకు మొలకలను మళ్లలో నాటవచ్చు. పశువుల ఎరువు బాగా వేయాలి. పొట్టి రకానికి ఎరువు ఎక్కువగా వేయరాదు. ఎరువు ఎక్కువైతే రొట్ట బలిసి, పూత తక్కువవుతుంది. మొదటి మొగ్గలు కనబడగానే, మొక్కను గుబురుకట్ట చేయడానికి కొమ్మల చివుళ్లు గిల్లివేయాలి. సాధారణంగా బంతి చెట్లకు వ్యాధులు, చీడలురావు.

రాములు : నాటిన ఎన్ని రోజులకు బంతి పూస్తుంది?

రాజు : బంతి నాటిన 55 రోజులకు పూలు రావడం మొదలవుతుంది. పూలుకోయడానికి ముందు నీటి తడి పెడితే, పూలలో తేమ బాగావుండి చాలా రోజులు తాజాగా వుంటాయి. హెక్టారుకు 6 నుండి 8వేల రూపాయల ఆదాయం వుంటుంది.

## VII

రాజు : రాములూ ... ఈ రోజు లిల్లీల గురించి చెప్పమంటావా?

రాములు : చెప్పండి...

రాజు : అనేక జాతుల లిల్లీలను పెంచవచ్చు. కొండప్రాంతాలు అనుకూలమైనవి. బెంగుళూరు వలె ఏటి పొడుగున ఒకే వాతావరణం ఉండే ప్రదేశాల్లో సైతం బాగా పెరుగుతాయి. అనేక జాతుల లిల్లీలతో బాటు సంకర జాతుల లిల్లీలు కూడా సాగులో ఉన్నాయి.

రాములు : లిల్లీలను ఏ నేలల్లో పెంచాలి?

రాజు : లిల్లీలకు చల్లని గుల్ల నేలలు, నీరు బాగా ఇంకే నేలలు కావాలి. చాలా లిల్లీలకు ఎండకావాలి. కొన్ని రకాలు నీడలో బాగా పెరుగుతాయి. ఉత్తర మైదానాలలో అక్టోబరులో, కొండలపై జూలై - అగష్టులోగాని నాటాలి. మళ్లను 61 సెంటి మీటర్ల లోతుగ తవ్వి, నాటడానికి ముందు ఎరువు వేయాలి. పశువుల ఎరువుకంటె, ఆకుపొల్లు వేయడం మంచిది.

రాములు : లిల్లీలను ఎలా పెంచాలి?

రాజు : లిల్లీలను విత్తనాలు, పాయలు, పొరలు, చిన్న పాయల ద్వారా

పెంచవచ్చు. గింజల నుండి పెంచిన మొక్కలు ఆలస్యంగా పూతకు వస్తాయి. ఒక్కోసారి ఐదు నుండి ఏడు సంవత్స రాలు పట్టవచ్చు.

రాములు : లిల్లీలను ఆశ్రయించే చీడలు, తెగుళ్ల గూర్చి చెప్పండి.

రాజు : బాట్రైటిస్ వ్యాధి వస్తే బోర్డో మిశ్రమంగాని, రాగి శిలీంధ్ర హారిని గాని చిలకరించాలి. ఫ్యుసేరియం వల్ల వేరు కుళ్ళు



వస్తుంది. తెగులు సోకిన పాయలను ఎత్తివేసి కాల్చి వేయాలి. ఫార్మలినుతో నేలను శుద్ధి చేయాలి. వైరస్‌వల్ల కూడా లిల్లీ లకు నష్టం కలుగుతుంది. వైరస్‌ల వలన ఆకులపై చుక్కలు, గీతలు, మచ్చలు వస్తాయి. గింజల నుండి వైరస్ సోకని మొక్కలు పొందవచ్చు.

## VIII

రాములు : పూలతోటల పెంపకానికి చాలా పెట్టుబడి అవసరమా?

రాజు : అంత ఎక్కువగా అవసరం లేదు. పూలతోటల పెంపకానికి ప్రభుత్వం సబ్సిడీ అందిస్తుంది.

రాములు : సబ్సిడీ ఇచ్చే వివరాలు తెలుపరూ?

రాజు : పూల తోటల అభివృద్ధి పథకం ద్వారా రైతులకు సబ్సిడీ అందుతుంది.

రాములు : ఏయేపూల పెంపకానికి సబ్సిడీ ఇస్తారు.

రాజు : ఈ పథకం క్రింద సంకర జాతి గులాబి, కాకినాడ గులాబి, మల్లె మరియు సంపెంగ పూల తోటలకు పూలమొక్కల మీద సబ్సిడీ ఇస్తారు.

రాములు : ఏయే మొక్కలపై ఎంత సబ్సిడీ వుంటుంది?

రాజు : సంకరజాతి గులాబి మొక్కలు ఒక్కొక్క రైతు 25 సెంట్లు మాత్రం నాటుకోవచ్చు, దీనికి ఐదువేల రూపాయల సబ్సిడీ ఇస్తారు. కాకినాడ గులాబి మొక్కలు ఒక్కొక్క రైతు ఒక ఎకరా మాత్రం నాటుకోవచ్చు. దీనికి ఐదు వందల రూపా యల సబ్సిడీ ఇస్తారు. ఇక మల్లె మొక్కలు ఒక్కొక్క రైతు 2 ఎకరాలు మాత్రం నాటుకోవచ్చు. దీనికి 2వేల రూపాయల సబ్సిడీ ఇవ్వబడుతుంది. సంపెంగ ఒక్కో రైతు ఒక ఎకరా మాత్రం నాటుకోవచ్చు. దీనికి 4 వేల రూపాయల సబ్సిడీ ఇస్తారు.

రాములు : ఈ సబ్సిడీని ఎవరు ఇస్తారు?

రాజు : రైతు ఈ మొక్కలు నాటుకొన్న తరువాత సంబంధిత ఉద్యాన అధికారి తోటను చూచి సబ్సిడీకి సిఫార్సు చేస్తాడు. ఇంకా

కణజాల వర్ధనం పద్ధతిలో రూపొందించిన పూల మొక్కలకు సైతం సబ్సిడీ అందిస్తారు.

రాములు : ఆ వివరాలేమిటి?

రాజు : కణజాల వర్ధనం పద్ధతిలో రూపొందించిన గులాబి మరియు చేమంతి మొక్కలు 75 శాతం సబ్సిడీ మీద ఇవ్వ బడతాయి. గులాబి మొక్కలు ఒక్కొక్క రైతు 25 సెంట్లు మాత్రం నాటుకోవచ్చు. దీనికి ఐదువేల రూపాయల సబ్సిడీ ఇస్తారు. చామంతి మొక్కలు ఒక్కొక్క రైతు 5 సెంట్ల వరకు నాటు కోవచ్చు. దీనికి ఐదువేల రూపాయల సబ్సిడీ ఇస్తారు.

రాములు : సబ్సిడీ దరఖాస్తు ఫారం ఎక్కడ దొరుకుతుంది?

రాజు : నిర్ణీత దరఖాస్తు ఫారం సంబంధిత ఉద్యాన అధికారి నుండి పొందవచ్చు. డివిజన్ స్థాయిలో ఉన్న సంబంధిత ఉద్యాన అధికారి సబ్సిడీ మంజూరు చేస్తాడు.

రాములు : పూలను మార్కెటింగ్ చేయడం ఎట్లా?

రాజు : నగరాలు, పట్టణాలకు దగ్గరగా ఉన్న గ్రామాల్లో ఉత్పత్తి అయిన పూలను తేలికగా మార్కెట్ చేసుకోవచ్చు. సహకార సంఘంగా ఏర్పడితే పూలను మార్కెట్ చేయడం సులువుగా ఉంటుంది. ధర గిట్టుబాటు అవుతుంది. పూల సాగుచేసే గ్రామాల్లో సైతం విడిగా అమ్ముకునే వీలుంది.

రాములు : పూల పెంపకంపై తగిన సాంకేతిక సలహాలు ఎవరు ఇస్తారు?

రాజు : పూల సాగులో తలయెత్తే సమస్యలను అధిగమించడానికి సమీపంలో ఉన్న కృషి విజ్ఞాన కేంద్రానికి వెళ్ళి నిపుణులను కలిసి తగిన సలహా పొందవచ్చు. రైతు జనోత్సవాలలో పాల్గొని, అభ్యుదయ రైతుల ప్రత్యక్ష అనుభవం తెలుసుకో వడంవల్ల ఎంతో ప్రయోజనం ఉంటుంది. రేడియో, టి.వి.లో ప్రసారం చేసే వ్యవసాయదారుల కార్యక్రమంలో నిర్వ హించే 'జాబులు - జవాబుల' ద్వారా నిపుణుల నుండి సందేహాలు దూరం చేసుకోవచ్చు. పూల సాగుకు సంబం ధించిన ఇతర వివరాలకు దగ్గరలోని ఉద్యాన విభాగ అధి కారిని సంప్రదించాలి.

వివిధ రకాల అలంకరణ, పూల విత్తనాలు లభించే చిరునామా :

I (a) డైరెక్టర్, ఇండియన్ హార్టికల్చర్ రిసెర్చ్ ఇన్స్టిట్యూట్, హెస్సరఘట్ట, లేక్‌పోస్ట్, బెంగుళూరు - 560089.

(b) ఇండో అమెరికన్ హైబ్రిడ్ సీడ్స్, బానశంకరి II స్టేజ్, బెంగుళూరు - 560070.

(c) దగ్గరలోని ఉద్యాన శాఖాధికారిని సంప్రదించి తగిన వివరాలు పొందవచ్చు.

II. టిష్యూకల్చర్ (కణజాలవర్ధనం) ఉత్పత్తులు లభించే చిరునామా (చామంతి, గులాబి), మెరిక్లోన్ బయోటిక్ ప్రైవేట్ లిమిటెడ్, 270 Q, రోడ్ నెం. 10సి, జూబ్లిహిల్స్, హైదరాబాద్.

Lasertypeset at Pritofast, 11/4 Old Rajinder Nagar, New Delhi-110060 and printed at Beauty Print, Paharganj, New Delhi-110055